# జాబిల్లి

♦ పిల్లల కథలు ♦




## కె. సభా

ఈ పుస్తకం

____________________

____________________

____________________ గారిది.



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**JABILLI** – *Children's Stories* by K. Sabha

``Published as part of the `**Books for All**' programme with partial support from **Centre for Innovation in Voluntary Action**."

**విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ**

ప్రచురణ నెం. : 2350/9

ప్రతులు : 2000

ప్రథమ ముద్రణ : జూలై, 2003



**వెల: రూ.25-00**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

# ఒక్క క్షణం...

బాలసాహిత్యంలో కృషిచేసి లబ్ధప్రతిష్ఠులైన అతికొద్దిమంది మొదటితరం రచయితల్లో కె. సభా ఒకరు. ఆంధ్రప్రభలో 'బాలప్రభ' శీర్షికను అనేక సంవత్సరాలు నిర్వహించిన అనుభవంతోనూ, పిల్లలపట్ల తనకున్న ప్రత్యేకమైన ప్రేమాసక్తులతోనూ ఆయన అసంఖ్యాకమైన రచనలు చేశారు. వాటిలో పిల్లలలో అన్ని వయస్సులవారికీ ఉపయోగపడే రచనలున్నాయి. ఆయన అన్ని ప్రక్రియల్లోనూ పిల్లలకోసం సాహిత్యాన్ని సృష్టించారు. పిల్లల గ్రహణ సామర్థ్యాన్ని, సృజనశక్తినీ పెంచేందుకు అవసరమైన సాహిత్యం రావల్సినంత విరివిగా అందుబాటులోకి రావడం లేదు. ఉన్న కొద్దిమంది రచయితల రచనలను పాఠకుల ముందుకు తీసుకురావడానికి రెండు మూడు ప్రసిద్ధ ప్రచురణ సంస్థలు తప్ప ఆసక్తి చూపడం లేదు.

కె. సభా సృష్టించిన బాలసాహిత్యం వాసిలోనూ, రాశిలోనూ గొప్పవే. పాటలు, పాటల కథలు, కథలు, నాటికలు, నవలలు మొదలైన భిన్నసాహిత్య రూపాలలో పిల్లలకు ఆయన అందించిన మానవీయవిలువలు, సందేశం, నీతి, కల్పనాశక్తి, పఠనాభిరుచి ఈ నాటికీ అత్యంత ఆవశ్యకాలని నా భావన. ఈ ఉద్దేశంతోనే వాటిని సంకలనాలుగా ముద్రించి నేటితరం బాలలకు కానుకగా ఇవ్వాలని సంకల్పించు కున్నాను. 3-5 వయస్సుమధ్య పిల్లలకు ఒక ప్రసిద్ధ ప్రచురణ సంస్థ 'బాలగేయాలు' అన్న పేరుతో ముద్రించింది. విశాలాంధ్ర ప్రచురణాలయం మరో పుస్తకం 'పిల్లల పాటల కథలు' వెలువరించింది.

ఇప్పుడు విశాలాంధ్ర ప్రచురిస్తున్న కథల సంపుటి 'జాబిల్లి'లో 13 కథలున్నాయి. ఇవన్నీ పసిహృదయాలకు హత్తుకునేట్లు రాసిన చక్కటి కథలు. ఆలోచింపజేసే సందేశాత్మక కథలు. మనసును గిలిగింతలుపెట్టే మంచి అల్లరిని చిత్రించిన కథలు. 'అవ్వబువ్వ' కథలో శ్రమవిలువను వివరించడం గమనించవచ్చు. అట్లాగే 'క్రమ శిక్షణ' కథలో తోటి మానవులపట్ల చూపాల్సిన దయ, కర్తవ్యాల బోధన గురించి తెలుసుకోవచ్చు. 'చిలకమ్మ'లో అల్లరి మనల్ని నవ్విస్తుంది. ఇలా ఇందులో ఉన్న కథలన్నీ ఆబాలగోపాలాన్ని అలరించేవే. వీటిని నేటిబాలలకు అందించాలనే సత్సంకల్పంతో ప్రచురిస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయానికి నా కృతజ్ఞతలు. చదువరులైన బాలబాలికలకు నా శుభాభినందనలు.

**డా॥ కె.యెస్. రమణ**

# ఇందులో...

# జాబిల్లి

హంద్రీ నదీతీరంలో ఒకచిన్న వనం. ఆ వనంలో కుందేళ్ళు, జింకలు కొల్లలు కొల్లలుగా వుండేవి. ఒక సీకిపొదలో ఒక కుందేలు దాని పిల్లతో కాపురం చేస్తుండేది. ఒకనాడు తల్లి కుందేలు మేతకుపోతూ పిల్ల 'జాబిల్లి'తో అన్నది (కుందేళ్ళ దేవుడు చంద్రుడు కాబట్టి తమ పిల్లలకి ముద్దుగా చంద్రుడిపేరే పెట్టుకుంటాయి) 'జాబిల్లీ! నేను వచ్చేవరకూ ఈ పొదను విడిచి పొయ్యావంటే ప్రమాదం వస్తుంది. జాగ్రత్త!'

జాబిల్లి ఈ మాట విని అలాగేనని చెవుల్ని ఊగించింది. తల్లి వెళ్ళిపోయింది. 'అమ్మ చెప్పిందిగదా బైటకు పోకూడద'ని మొదట అనుకున్నది గానీ మళ్ళీ కాస్సేపటి కల్లా గెంతుతూ నదిగట్టుకు వచ్చేసింది. ఆ గట్టులోవున్న నేరేడు చెట్టు తొర్రలోనుండి గూడ్లగూబ గూఁగూఁ అంటూ తరుముకొన్నది. కుందేలు పరుగెత్తుతుంటే ఒకరోడ్డు అడ్డంగా కనిపించింది. ఆ రోడ్డులో



వెడుతున్న కారొకటి బుర్రుమంటూ దుమ్ములేపింది. పాపం జాబిల్లి కళ్ళనిండుకూ దుమ్ము నిండిపోయింది. దారి తెలియకుండా కాలికొద్దీ పరుగు తీసింది.

ఒక బంగళావద్ద ఆగిపోయింది. ఆ గేటుదగ్గర కుక్క బొంయ్యిమంటూ తరుముకున్నది. వంటింట్లోకి కుందేలువస్తే ఇక దానిగతి ఎలావుంటుంది పాపం! బాగా పొద్దుపోయింది. మేడలో అంతా దీపాలు ఆర్పివేసి పడుకున్నారు. జాబిల్లి మెల్లగా మేడమీద వసారాలోనుండి కిటికీలోకి దూకి సరాసరి పుస్తకాల బీరువామీద వెళ్ళికూచున్నది. నిదానించి గదినంతా చూచింది. ఓమూల సన్నని దీపం మండుతోంది. ఆ పక్క రెండు ఊయల లున్నాయి. ఊయలల్లో ఇద్దరు పాపలు పడుకుని హాయిగా నిద్రపోతున్నారు. జాబిల్లి మెల్లగా అలికిడి చేసింది. ఈ శబ్దానికి యిద్దరూ మేలుకొని జాబిల్లిని కఱ్రతీసుకొని గదిలోనుండి వెళ్ళగొట్టేశారు పాపం! ఆ అర్ధరాత్రిలో ఎక్కడికిపోవడానికీ తోచక జాబిల్లి ఆ పై కిటికీలో పడుకున్నది.

ఐదు నిమిషాలు గడిచాయో లేదో ఒక గజదొంగ మేడలోకి వచ్చాడు. ఆ దొంగ కిటికీలోనుండి క్రిందకు దిగుతుంటే పాపలిద్దరూ కెవ్వుమంటూ కేకపెట్టారు. జాబిల్లి వెంటనే గభాలున దొంగమీదకు దుమికింది. దొంగ బేజారెత్తిపోయి బ్రతుకుజీవుడా అంటూ బయటపడ్డాడు.

ఇద్దరు పాపలు జాబిల్లిని ఆప్యాయంగా దువ్వి, దానికి పాలుపండ్లూ ఇచ్చారు. జాబిల్లి పాలను వాసనచూచి అక్కడున్న చిన్న మోటారుబండిలో కూర్చున్నది. పాపాయి లిద్దరూ బండిని లాగుతుంటే కుందేలు కూచుని కూనిరాగాలు తీసింది. ఈలోగా యింటి యజమాని లోపలకు వచ్చాడు. జాబిల్లి ఒక బెలూన్ తీసుకొని మేడనుండి కిందకు దూకి పరుగు లంకించుకున్నది.

ఆ మరునాటి రాత్రిగూడా పాపాయిలు జాబిల్లికోసం చూచారుగాని అది రానేలేదు.

# అవ్వ-బువ్వ

బడిలో పంతులమ్మ నా చెవుల్ని నులమడంతో నాకు పెద్దకోపం వచ్చింది. ఇంటికి రావడంతోటే పళ్ళెం ముందు కూచున్నా. బువ్వ తెల్లగాలేదు. రంగు మారిపోయింది. కోపం పెరిగిపోయింది. పళ్ళాన్ని విసిరి కొట్టేశాను.

ఇంకేముంది! సరిగ్గా ఆ పళ్ళెం గిరగిరా వెళ్ళి మూలను కూచున్న అవ్వముఖాని కంటుకుంది. అవ్వ ముఖమంతా అన్నంతో అలకినట్టయి పోయింది. కోపం ఎక్కడ దాక్కుందో నవ్వలేక చచ్చిపోయాను.

అవ్వకు కోపంరాలేదు. కోపం వచ్చినా భయపడతాననా? ఉహు... ఆ ముసలవ్వకు మూడు కాళ్ళతో నడిచి నన్ను పట్టుకోడం చేతకాదు. పాపం పైకిలేచి ముఖం కడుక్కుని నన్ను దగ్గర కూచోపెట్టింది.... పళ్ళెంలోనే బువ్వ పెట్టమని కలుపుతూ చెప్పిందిగదా;



'ఒరేయ్ పిచ్చినాయనా! బువ్వ వూరికేవస్తుందా? ఈ బువ్వకోసం ఎందరో మనుషులు, పశువులు, ఎద్దులు ఎన్నో కష్టాలు పడతాయి - తెలుసా' అంది.

నాకేం తెలుసు. మానాన్న డబ్బులిస్తే మా అన్నయ్య పట్టుకొస్తాడు బియ్యాన్ని. అంతేగా దానికోసం ఎందుకు కష్టపడాలి అనుకున్నా!

అవ్వ అందిగదా-

'మొదట భూమికి నీళ్ళుపెట్టి బాగా దున్నాలి. ఆకు ఎరువులు, పెంటఎరువులు, చేపల ఎరువులు ఎంత ఎక్కువవేస్తే అంత మంచిది... ఆ పొలాన్ని దున్నడమంటే సామాన్యంకాదు. ఎడ్లు, మనుషులు చెమటలో తడిసిపోతారు. ఇంతా చేశాక వడ్లు మొలకెత్తాలి. వీలైతే నారుమడిని నాటాలి...'

అవ్వ చెబుతుంటే బువ్వ తింటూనే వున్నా.

ఆ పైరు ఎదగాలంటే ఎప్పుడూ నీళ్ళుండాలి. మరి నీరు ఊరికే రాదుగా. మోటతోలాలి, ఏతాం వేయాలి. ఇసుక కాలువలెత్తాలి. పైరులో ఎదిగే కలుపుమొక్కలను తీయడం ఎంత కష్టమనుకున్నావు! ఉదయం మొదలు చీకటిపడేవరకు నడుము వంచుకునే పనిచేయాలి. ఈ పనంతా స్త్రీలే చేస్తారు పాపం....

వెన్నుపుట్టాక పిట్టలతో ఎలుకల్తో రోజూ పోరాటం! పిట్టలు గుంపులు గుంపులుగా దండెత్తి వస్తాయి. ఎలుకలో, కన్నాలు పెడతాయి. ఈ పంట కోయడానికి మనుషులు, కొట్టడానికి మనుషులు ఎందరెందరో కావాలి.... గింజలు రాలగొడుతుంటే రెక్కలు నొప్పులెత్తుతుంటై.

గింజలు రాలాక వాటిని ఎండబెట్టి, దంచి, అమ్మితే బియ్యం అంటూ తెచ్చుకుంటున్నాము. ఇందరు మనుషులూ ఎద్దులూ కష్టపడి పండించిన పంటను అమ్మ జాగ్రత్తగా వండిపెడితే పారేసేవే....వూరికే వస్తుందా?'

ఆపాటికే బువ్వ ఐపోయింది. పళ్ళెంలో ఒక్క మెతుకునుగూడా వృధాగా విడిచిపెట్టలేదు. ఆనాటినుండి బువ్వను చిందివేయడం, పారేయడం మానేశాను. మీరూ అలానే చేయాలి మరి.



# బెల్లం! బెల్లం!!

తెనాలి రామకృష్ణుడు గొప్ప కవిగదూ? అలాంటి మహాకవిగూడా నేనంటే చెవికోసుకుంటాడు! అందుకే ఆయన యేమని వ్రాసుకున్నాడో తెలుసా? 'తెన్నాలి రామకృష్ణుడు తిన్నాడురా తట్టెడంత తియ్యని బెల్లం' అని సంతోషపడ్డాడు. నిజం చెప్పాలి మరి. మీరూ అంతేగదూ? తినడానికి నేనెంత తియ్యగా వుంటాననుకున్నారు! నేను లేకుంటే ఏ ఫలహారంమాత్రం బావుంటుంది?

మరి నన్ను బాగా తినడం మాత్రం నేర్చుకున్నారే. నేనెలా తయారవుతున్నానో తెలుసా?



మొదట నేలలో చాళ్ళుతీసి నన్ను ముక్కలు ముక్కలుగా పాతిపెడితే నీళ్ళు తాగితాగి పైకి తొంగి చూస్తాను. మీకు కాఫీ ఫలహారాలిచ్చే మోస్తరుగా గానుగపిండీ, నీళ్ళూ పెడుతుంటే బాగా పెరిగి పోతాను.

మళ్ళీ ఏం చేస్తారో తెలుసా? నన్ను లాక్కెళ్ళి, నాపైన చలికి కప్పుకుని వుండే ఆకుల్ని తొలగించి, నన్ను గానుగలోపెట్టి నలిపేస్తారు. అప్పుడు నాకు ఎంత బాధనుకున్నారు? ఐనా నా వల్ల సుఖపడేవారున్నారని కష్టాలు భరిస్తాను. ఆ వెనుక నేను రసంగా మారిపోతాను. నన్ను కడవలకు యెత్తి పెనములో పోస్తారు....

అబ్బా, చెప్పలేనుగానీ కింద నా ఆకుల్ని నా పిప్పినీ కట్టెల్నీవేసి మంటబెడతారు. ఆ సెగకు వుడికిపోతాను.

మొదట చెఱుకుగడగా వుండిన నన్ను గానుగలో పెట్టి, రసంగా తయారుచేసి, పెనములోపోసి క్రిందమంటవేస్తే కుతకుతా వుడికి, చివరికి పాకం ఐపోతాను. జిగురువచ్చిన సమయంలో దోనెల్లోపోస్తారు. అచ్చులలో పోస్తారు.

మళ్ళా ఒకచెక్కతో అదుముతారు. అంతవరకు చెఱుకు అనీ, చెఱుకురసమనీ, చెఱుకుపానకమనీ పిలువబడిన నేను బెల్లం ఔతాను. దయగలవాళ్ళు అంతటితో విడిచిపెడితే బెల్లం చెక్కరై మీ వద్దకు వస్తాను. కొందరు మళ్ళాముద్దనుచేసి పారేస్తారు.

ఇన్ని బాధలూ నేను సహించానంటే ఎందుకనుకున్నారు? ఏడ్చే పాపాయిలను ఊరుకోబెట్టటానికే. ఎదిగే బాలబాలికలకు బలం యివ్వటానికే!

ఇంత తియ్యగా నన్ను ఎవరు తయారు చేస్తారనుకున్నావు?

తింటాను తింటాను బెల్లం
తీపుగా వుంటుంది బెల్లం
అనుకుంటావేమో? అబ్బాయీ
ఊరికేవస్తుందా? అమ్మాయీ?
పంటమాత్రమేగాదు బెల్లం
వంటచేసిన వెనుక బెల్లం
కొంటేను వస్తుంది బెల్లం....

# క్రమశిక్షణ

రోజూ ఒక్కసారి రౌండు రోడ్డును చుట్టిరావడం రిజర్వు పోలీసులకు మామూలు. ఆ దినం సార్జంటు అన్నాడు.

'రోజూ నాలుగైదు నిమిషాలు లేటుగా వస్తున్నారు ఈ దినం ఐదునిమిషాలు ముందుగా రావాలి. లెఫ్ట్....రైట్ మార్చ్ ఆన్....'



బూట్లు టకటకలు తాళగతుల కనువుగా పడుతున్నాయి. ఎక్కడా ఎవరూ సోమరితనంలో లేరు. అందరూ చురుగ్గానే పోతున్నారు. దారిలో అటూ యిటూ కూడా తిరిగి చూచేవారెవరూ

లేరు. ఒకటే చూపు. ఒక్కటే అడుగు. క్రమశిక్షణంటేనేమో వారివద్దనే నేర్చుకోవాలి. బారులుతీరి నడిచిపోతున్న ఆ పౌరసేనలో 'ఎంతటి క్రమత వున్నది' అనుకుంటున్నారు చూచినవారంతా.

ఉత్తరపు మలుపుతిరగ్గానే ఒక సెలయేరు వస్తుంది. సెలయేటి నిండుకూ గలగలమంటూ ప్రవాహం. వంతెనను సమీపించింది పౌరసేన. వంతెనపై బూట్లచప్పుడు. వంతెన కింద ప్రవాహం పాడుతున్న పాట హాయిగానే ఉంది. ఇంతలోనే సమూహం మొత్తం ఒక్కసారి నదిలోకి తొంగిచూచింది. ఎవరో స్త్రీమూర్తి కొట్టుకుపోతున్నది. క్షణం నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడలేదు. అంతా క్రమశిక్షణకు లోబడ్డవారు. వెనుక వస్తున్న అతడు కేకవేశాడు మార్చ్ ఆన్.... ఆ కేకతో సేన మొత్తం వులిక్కిపడింది. టక్ టక్ మళ్ళీ బూట్లచప్పుడు. అందరూ వెళ్ళిపోతున్నారు. క్రమబద్ధంగా అడుగులు వేసుకుంటూ పోతున్నారు.

ఒక్కడుమాత్రం వున్నట్టుండి వంతెన గోడమీదకు ఎక్కాడు. వెనకవస్తున్నవారతణ్ణి చూడలేదు. చూడటం క్రమశిక్షణకాదు. అతడు నదిలోకి దుమికాడు. అందరూ ఆశ్చర్యంతో అటుతిరిగి చూశారు. వెనుకనున్నతడు 'మార్చ్ ఆన్' అన్నాడు. అందరూ ముందుకు సాగారు.

క్రమశిక్షణతో పౌరసైనికులందరూ ఐదునిమిషాలు ముందుగా మైదానం చేరుకున్నారు. సార్జంటు వచ్చాడు. అందరూ శాల్యూట్ చేశారు. రోల్ కాల్లో నెంబర్ ఒన్ సిక్స్‌టీన్ ఆబ్సెంట్.

ఎందుకని ప్రశ్నించాడు. ముందున్న గొంతు ధ్వనించింది. 'నదిలో దూకాడు' అని.

సార్జంటు మళ్ళీ ప్రశ్నించాడు.

'ఎందుకో తెలియదు' అన్నదా గొంతు.

వందగజాల దూరంలో నెం. 116 గసపోసుకుంటూ వస్తున్నాడు. సార్జంటు అతనివైపు చూచాడు. అందరూ అతణ్ణే చూస్తున్నారు. అతడు వచ్చి సరిగ్గా నిటారుగా నిల్చుని శాల్యూట్ చేశాడు. అతని బట్టలన్నీ తడిసివున్నాయి. అతని మోకాటికి బలమైన గాయాలు తగిలినట్టుంది; రక్తం కారుతున్నది. టోపీ బురదమయంగా వుంది. చొక్కాలో గుల్లలు తగులుకొని వున్నాయి.

'ఎందుకు లేట్' ప్రశ్నించాడు పిడుగులా సార్జంటు.

'నదిలో ఒక స్త్రీ కొట్టుకుపోతుంటే దూకి గట్టుకొనకు చేర్చానండి' చల్లగా చెప్పాడు సైనికుడు.

'వీళ్ళంతా చూచారా' ప్రశ్నించాడు సార్జెంటు.

'చూశామండి' ఏక కంఠం విన్పించింది.

'నేను చూడనేలేదు' ముందున్న కంఠం మాత్రం ధ్వనించింది.

'మార్చి ఆన్' అన్నాడా కంఠాన్ని సార్జంటు.

అతడు దూరంగా వెళ్ళాడు. 'కమాన్' అన్నాడు సార్జంట్ నెం. 116 వంకచూచి. అతడు ముందుకు వచ్చాడు.

షేక్ హ్యాండిచ్చాడు సైనికునికి సార్జంటు. అతన్ని సైన్యానికి ముందుభాగంలో నిల్చోబెట్టాడు. ఈ దృశ్యాన్ని చూచిన మిగిలినవారందరూ ఆశ్చర్యపడ్డారు. 'డిసిప్లిన్ అంటే ఏమిటి? దాన్ని ఆచరించి చూపాడు నెం. 116' అన్నాడు సార్జంటు. సైనికులందరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

'పౌరులను రక్షించటమే పౌరసేన క్రమశిక్షణ' అన్నాడు మళ్ళీ సార్జంటు. అందరూ తలలు దించుకున్నారు. నాటినుండి నెం. 116 అంటే అందరికీ విపరీతమైన గౌరవం.

# ఎల్లమ్మ

ఈ కథను మా అవ్వ చెప్పింది. అందుకే ఈ కథంటే నాకు చాలా ఇష్టం. ఆనా డేతారీఖో నాకు తెలియదు. ఎంతవయస్సుంటుందోకూడా గుర్తులేదు. బహుశా పది ఉండవచ్చునేమో! నేనూ, మాణిక్యం, రామరత్నం మా అవ్వదగ్గర కూచున్నాము. అవ్వకు పండ్లులేవు. బోసినోటితో తుస్సుతుస్సు మంటూంది. నాకామె మాట్లాడుతుంటే బలే నవ్వు. ఐనా కథకోసం మెదలకుండా కూచున్నాను.

'ఇక్కడికి ఆరామడల దూరంలో శేషాపురమనే ఊరుంది. ఆ ఊళ్ళో దొడ్డప్పనే మేటిరైతు ఉండేవాడు. వాళ్ళింట్లో రామలక్ష్మణ కళిజాలుండేవి. ఒక్కొక్క కళిజంలోనూ వంద పుట్లు పట్టేవి.



పెద్ద ఆవులమంద... పిండేపాలు పెనిమలకు పోసేవారు. వండే అన్నం గుట్టలు గుట్టలుగా పోసేవారు. వార్చే గంజి మడుగులు నిండేది.'

అమ్మబాబో....వార్చేగంజి మడుగులైతే వండే అన్నం గుట్టలైతే సముద్రమంత చారు కావాలేమో అన్పించింది.

'ఆ రైతుకు చక్కనిచుక్క అందాలచిలుక, అపరంజి మొలక, ఒక్క చెంప కొడితే వజగారుతుంది. మరో చెంప తాకితే పాలుగారుతుంది. చెంప చెంపకూ చేరడేసి కళ్ళు. పీసనిమ్మ పండంటి వళ్ళు, పచ్చిబియ్యంవంటి పండ్లు,' అన్నది అవ్వ.

'అంత అందంగా ఉంటుందా అవ్వా?' అన్నాడు. 'ఔరా! కొడుకో. ఆమెకు పెళ్ళి చేయాలని దొడ్డప్ప అనుకున్నాడు? శేషాపురానికి ఉత్తరాన నాలుగామడలలో ఏనబాకమనే పల్లె ఉంది. ఆ ఊళ్ళో రంగయ్యనే రైతుకు ఓబులయ్యనే కొడుకు. ఓబులయ్య బలే అందగాడు. నలుపు నారాయణుడు మెచ్చుగదా! ఓబులయ్య నల్లగా ఉన్నా అచ్చంగా రాజపుటక. ఆజానుబాహువులు. కురుకురు మీసాలు. కోలమొగంలో పొడుగాడి ముక్కు. ఓబులయ్యకూ దొడ్డప్ప కూతురు ఎల్లమ్మకూమంచి లగ్నంలో పెళ్ళి నిశ్చయమైంది. దొడ్డప్ప, రంగయ్య వక్కాకులు మార్చుకున్నారు. ముహూర్తం రేపనగా ఏనబాకానికి యాభై బండ్లు కట్టారు, అన్నీ రెండెద్దులబండ్లే. కుప్పెలూ గిగిరెట్లూ ఘల్లు ఘల్లు మంటుంటే బండ్లు కడచీలల మువ్వలు ఝుణఝుణ లాడాయి.

ఎల్లమ్మకు కూర్చిన ముత్యాలు దండలు వేశారు. కూరవని ముత్యాలు తలంబ్రాలు పోశారు. మొగిలిరేకులతో జడను అల్లారు. పచ్చలనాగరాన్ని పెట్టారు. చంద్రునంత జడ బిళ్ళను పెట్టారు. కొండంత జడకుచ్చులు కట్టారు. బంగారు చెట్లచీరెను కట్టుకొన్నది. అద్దాల రెవిక తొడిగింది మేళతాళాలతో పెండ్లి వారంతా కదిలారు. ఎల్లమ్మ మధ్య బండిలో కూచున్నది. ముందూ వెనుకా బండ్లుపోతున్నాయి.

కనుచీకటి పడగానే దివిటీలు వెలిగించారు. అప్పుడీలాంటి రోడ్లులేవు. కాకులు దూరని కారడవి దాటి చీమలు దూరని చిట్టడవి ప్రవేశించారు. ఆకాశమంతా నల్లగా ఉంది. అక్కడక్కడా చుక్కలు మాత్రం తెల్లగా ఉన్నాయి. ప్రయాణం సాగుతూ ఉంది. అవ్వ చెబుతుంటే మా రామరత్నం అడిగింది. 'పెళ్ళికూతు రింకేమేమి నగలేసుకొనిందవ్వా' అని.

'చెబుతానే చిలకా! అలా అడుగు. నడుముకు వడ్డాణం వేసింది. ముక్కుకు నత్తుదొడిగింది. బులాకీ ఉండనే ఉంది. ముక్కు పుల్లిగూడా ఒకటి పెట్టుకుంది. సూర్య చంద్రుల్లాంటి కమ్మలు వేసుకొన్నది. ఆది శేషులంత మాటీలు వేసింది. కుంకుమ పువ్వుల్లాంటి గూబావరులేసి ఉల్లి పువ్వులంత కర్నపూలు తొడిగింది. సొగసైన జోమాలదండ... కలిగింది కాసులదండ - కణికెడేసంత గజ్జలుండే బంగారడ్డిగ వేసింది. చేతిలావు కడియాలు దొడిగింది. వ్రేలికొక ముద్దుటుంగరం దొడిగింది. కాళ్ళ వేళ్ళకు కాళాయి పళాయి దొడిగింది. ఇక చాలునే చిలుకా' అన్నది అవ్వ.

రామరత్నం సిగ్గుతో తలవంచుకొన్నది. అవ్వ ప్రారంభించింది.

'బండ్లు వెడుతుండాగానే దివిటీలు ఆరిపోయాయి. అంతే యమదూతల్లాంటి దొంగలు నూరుమంది పైనపడ్డారు. వీరులంతా ఈటెలు పట్టారు. శూరులంతా శూలాలెత్తారు. కుప్పించి ఎగసింది కొదమసింగంలాగా రైతుపడుచు ఎల్లమ్మ. బారెడు పొడుగు పట్టాకత్తి చేతపట్టింది. అందిన జుట్లను అడుగంట గోసింది. కత్తికందిన మెడలు కరకరకోసింది. ఏటుకు ఏడుగురు దొంగల నరికింది. పోటుకు ముగ్గురు బంటుల పొడిచింధి. కారేనెత్తురు, కడవలుకాగా పారేనెత్తురు పంట్లకు పట్టవచ్చు. మొండె తుండాలతో నిండిపోయిందడివి.' అవ్వ ఒక్క నిమిషం ఆగింది.

'దొంగలంతా చచ్చిపోయారా అవ్వా!' ప్రశ్నించాను నేను.

'లేదురా కొడకా! లేదులేదు. ఎదురుగా వచ్చేది వీరలక్షణం. పొంచి పొడిచేది పోకిరీ లక్షణం. దొంగల నాయకునికి కంగారెత్తింది. పొదలో పొంచి కూచున్నాడు. ఎల్లమ్మ దగ్గరకు రాగానే బల్లెం విసిరాడు. అది గుండెల్లో గుచ్చుకొన్నది. గుచ్చుకొన్న బల్లాన్ని ఎడంచేత్తో పట్టుకొని కుడిచేత్తో దొంగల నాయకుని శిరస్సును ఖండించింది ఎల్లమ్మ తల్లి. అంతే! అక్కడే వెళ్ళిపోయింది స్వర్గానికి. ఆమెకు స్వాగత మివ్వడానికి దేవకన్నెలు దిగివచ్చారు. రెక్కల విమానం చక్కావచ్చి నిల్చింది. ఎల్లమ్మ విమానంలో కూచుని చల్లని చంద్రలోకం దాటుకొని స్వర్గలోకం ప్రవేశించింది' అన్నది అవ్వ.

'అయ్యో? పెళ్ళికొడుకు ఓబులయ్య ఏమైనాడవ్వా?' అన్నది రామరత్నం.

'అ రాత్రి ఏనబాకంనుండి పదిమంది మనుషులు ఎదురు వచ్చారు వెదుక్కొంటూ. ఏమున్నది? అందరూ చచ్చిపడి ఉన్నారు. దొడ్డప్ప కొన ఉపిరితో మూలుగుతున్నాడు. చివరికి రంగయ్యకు తెలిసింది. గోడుగోడునా గోలపోయాడు. కన్నీరు కాలువలైనాయి. ఏడ్చిననీరు ఏరులైపారాయి. ఓబులయ్య పెళ్ళిచేసుకోలేదు. ఎల్లమ్మ నక్కడే సమాధి చేసి గుడికట్టించారు. ఆనాటినుండి ఎల్లమ్మనంతా కొలుచుకొంటారు. ఎల్లమ్మపేరు చెబితే ఎంతటి దొంగలైనా హడలిపోతారు. పంటపొలాలవద్ద కాపలాలుండే పడుచువాళ్ళను ఎల్లమ్మ కాపాడుతుంది. అందుకే కొందరు చేలలో ఎల్లమ్మ కోపాది బిగిస్తారు.' అన్నది అవ్వ.

'ఈ మారు ఎల్లమ్మ తిరణాలకు మనం వెళ్ళాలవ్వా' అన్నాడు మాణిక్యం. 'నేనుగూడా' అన్నది రామరత్నం. మరి నేనో' అన్నానునేను. 'ఓరి నా బంగారు! నువ్వులేంది తిరణాలే జరుగదురా. పడుకో పడుకో... పొద్దున్న చద్దిబువ్వ తీసుకొని పోదాం' అన్నది అవ్వ.

ఆ ఏడేకాదు, ఏటా ఎల్లమ్మతిరణాలకు నేను వెడుతూనే ఉంటాను, రంకెలరాట్నంలో గుర్రంమీద కూచుంటాను. కానీ మా అవ్వమాత్రం లేదు. ఆమె ఉంటేగా చద్దిబువ్వ కట్టి నెత్తిపై పెట్టుకొని నన్ను చంకన పెట్టుకొని వెళ్ళడానికి అయ్యో! అవ్వా!...



# సివంగి

సుందరం చాలా చురుకైన కుర్రాడు. తనమిత్రుడు 'సివంగి'తో ఎప్పుడూ ఆడుకుంటూ వుండేవాడు. సివంగి రానురానూ చిక్కిపోతుండడం చూచి చివరికి ఒకమంచి డాక్టరుగారి దగ్గరకు తీసుకెళ్ళాడు. డాక్టరుగారు కుక్కపిల్లను ఎగాదిగా చూచి 'దీనికి జబ్బేమీలేదు. బలహీనంగా వుంది' అన్నాడు. అయితే బాగా బలిసేట్టు మంచి మందిమ్మన్నాడు.

డాక్టరుగారికి ఆయుర్వేదము-భూతవైద్యము-మంత్రవైద్యము - యునాన్ని - హోమియోపతి సమస్తమూ తెలుసు. ఎలాగ తయారు చేశారో తెలియదుగానీ సివంగి నోటిలో ఒక్కమాత్రవేసి పంపించాడు.



వస్తూండే దారిలో మరోకుక్క ఎదురైంది. ఇతర కుక్కల్ని చూస్తే తోకముడుచుకొని పరుగెత్తే సివంగి 'భౌఁయ్యి' మంటూ దాన్ని తరుముకొన్నది. సుందరానికి ఆశ్చర్యం వేసింది. సివంగి చాలా బాగా తయారయిందనే ఆనందంతో ఇంటికి వచ్చాడు.

సివంగి రెండుమూడు వారాలకే బాగా బలిసిపోయింది. ఆ మందు ప్రభావం అలాంటిది. సివంగితో ఆడుకోడానికి సరిపోయే స్నేహితుని కుదర్చాలని సుందరం సివంగిపై కూచుని ప్రయాణమయ్యాడు. రోడ్డుమీదికి వెళ్ళి బస్సు కోసం చూశాడు. బస్సువచ్చిందిగానీ కండక్టరు సివంగినిచూచి ఏనుగంత కుక్కను బస్సులో ఎక్కించుకోవడం మా తరం కాదంటూ యీలవేసి వెళ్ళిపోయాడు.

ఈలోగా ఒక జట్కాబండి వచ్చింది. జట్కాబండివాణ్ణి ఆపి 'నీ గుఱ్ఱానికి నా సివంగికీ, దోస్తీ కలుపుదామా' అంటూ ప్రశ్నించాడు సుందరం. ఈలోగా సివంగిని చూచిన గుఱ్ఱం ఎగిరి గంతేసి దౌడు తీసింది. బండి పల్టీకొట్టింది. అందులో కూచున్నవారు గుమ్మడి కాయల్లాగా వీధిలో పడ్డారు. పాపం! జట్కావాడు సుందరాన్ని చురచురమని చూస్తూ బండిని లేవనెత్తుతుంటే సుందరం సివంగిని పిలుచుకొని బయలుదేరాడు. ఏనుగంత సివంగి వెనక వెడుతుంటే జనమంతా ఇదెక్కడి జంతువోనని వింతపడ్డారు.

సుందరం చక్కా జంతుప్రదర్శనశాల వద్దకు వచ్చాడు. ముందుగా సింహాన్ని అడుగుదామనుకున్నాడు. సింహం దగ్గరకు వెళ్ళి 'కేసరీ! నా సివంగితో దోస్తీ కలుపుతాను వస్తావా? అన్నాడు. సింహం సివంగిని చూచిందే బెంబేలుపడి వెనక్కి నక్కి 'ఉహూఁ' అన్నది. ఇక లాభం లేదనుకొని ఏనుగు వద్దకు వచ్చాడు. 'ఓహో గజరాజా! నా సివంగితో దోస్తీ కలుపుతావా?' అన్నాడు. ఏనుగు సివంగిని చూచిందే గుండె పగిలి ఒకే పరుగు లంకించుకున్నది.

సుందరం నిరుత్సాహంతో అక్కడే కూచున్నాడు. సివంగి స్నేహితులెవరూ దొరకలేదని ఏడుస్తున్నది. చివరకు సుందరం సివంగిని పిలుచుకొని యింటికి బయలుదేరాడు. దాని వెంబడి జనులు సివంగిని చూచి అదిరిపడి దారి విడుస్తున్నారు.

ఏనుగంత సివంగిని ఎక్కడవుంచాలో గూడా సుందరానికి తోచలేదు. తుదకు డాక్టరుగారు జ్ఞాపకానికి వచ్చారు. తక్షణం సివంగిపై కూచుని అతని వద్దకు బయలుదేరాడు.

డాక్టరు నవ్వుతూ ఎందుకొచ్చావన్నాడు. 'నా సివంగిని ముందులాగా సన్నగా చేయకుంటే నేనిక్కడినుండి పోను' అన్నాడు.

డాక్టరు నవ్వుతూ సివంగి నోటిలో మాత్రవేశాడు. ఏనుగంత సివంగి పిల్లిలాగా మారిపోయింది. సుందరం సివంగిని ఎత్తుకుని ఇంటిముఖం పట్టాడు.

# తోడికోడళ్ళు

రామయ్య, శంకరయ్య యిద్దరూ అన్నదమ్ములు. రామలక్ష్మణుల మధ్య భేదాలు వచ్చినవేమో చెప్పలేముగానీ ఈ యిద్దరి మధ్యా ఎటువంటి సమయంలోనూ రవ్వంతైనా మనస్తాపం కలుగలేదు. అన్నని విడిచి తమ్ముడుగానీ, తమ్ముణ్ణి వదలిపెట్టి అన్నగానీ ఒక్కక్షణం వుండలేరు. ఉండవలసిన అవసరం గూడా కలుగలేదు.

ఉదయమే ఇద్దరూ పొలాలకు వెళ్ళేవారు. మధ్యాహ్నం యింటి నుండి తెచ్చిన అన్నంతిని సాయంకాలం వరకూ అక్కడే పనిచేసేవారు. పొద్దుపోతున్నదనగా కాడి గిత్తల్ని తోలుకొని కసువుదిండ్లు మోసుకొని యింటికి వచ్చేవారు.



ఇద్దరికీ పెళ్ళీడు వచ్చింది గనుక పెళ్ళిళ్ళు చేయాలని వాళ్ళ నాన్నగారు ఆలోచించారు. తన స్వంత బావమఱది కూతుళ్ళే యిద్దరున్నారు. అన్నాదమ్ముళ్ళ కిద్దరికి అక్కాచెల్లెళ్ళి తెచ్చి పెళ్ళిచేస్తే అసలు పేచీనే వుండదని నిశ్చయించుకొని బావమఱదిని అడిగి చూచాడు. అతడు సరే అనటంతోనే వివాహాలు నిశ్చయింప బడినాయి.

పెళ్ళికూతుళ్ళిద్దరూ యింటికి వచ్చారు. వారం రోజులు నెమ్మదిగానే గడిచాయి గానీ ఆ వెనుకరోజు ఒక కలహం ప్రారంభమైంది. స్వంత అక్కాచెల్లెళ్లే ఐనా తోడికోడళ్ళ మధ్య ఉఫ్‌మంటే నిప్పు రాజుకపోయేది.

రామయ్య, శంకరయ్య ఈ వ్యవహారాల్లో ఏమీ జోక్యం కల్గించుకొనేవారు గారు. అయినా యింట్లో అంతఃకలహాలు నానాటికీ ముదిరిపోతూ వచ్చాయి.

శంకరయ్య భార్య కామాక్షి చాలా గడుసుపిల్ల. ఇంట్లో చేతికి దొరికిన వాటినంతా అమ్మటానికి ప్రారంభించింది. బియ్యంనుండి నెయ్యీ నూనెలదాకా ఏది దొరికినా అమ్మి ముల్లెకట్టడంచూచి రామయ్య భార్య అనసూయమ్మ కూడా ఆ విధంగానే తయారైంది.

కామాక్షి ఒకనాడు దీర్ఘంగా ఆలోచించింధి. బియ్యం అమ్మితే చాలడంలేదు. పైగా అది బాగా తెలిసిపోతున్నది. అంచేత అన్నాన్ని అమ్మితే బావుండుననుకున్నది. కాని అన్నం అమ్మితే పల్లెలో కొనేవారుండరు. కనుక సాధ్యమైనంత ఎక్కువ అన్నాన్ని దాచిపెట్టితే, అన్నదమ్ములు విడిపోయినప్పుడు అసలు వండుకునే పనిలేకుండా హాయిగా కాలుమీద కాలువేసుకొని తినవచ్చు ననుకొన్నది.

రోజూ మధ్యాహ్నంపూట ఒక్కముద్ద సంగటి - రాత్రి పదిగంటలపుడు చలిదికి వుంచిన అన్నంలో సగంతీసి ఒక గాదెలో వేస్తూవచ్చింది. ఇంట్లో ఈ విషయం ఎవరికీ తెలియదు.

కామాక్షి ఈ విధంగా హుషారుపడి అతి తెలివిగా అన్నాన్ని దాచిపెడుతుంటే అనసూయమ్మగూడా ఒకరోజు ఆలోచించి తాను ఏదో దాచిపెట్టుకోకుంటే విడిపోయాక కుటుంబం సాగడం ఎట్లాననుకున్నది. అంచేత రోజు చేస్తున్న కూరలలో కొంతతీసి ఒక కాగులో పోస్తూ వచ్చింది.

ఇంట్లో రోజూ భార్య లీ విధంగా దాచిపెడుతున్న విషయం రామయ్యకూ, శంకరయ్యకూ తెలియదు. ఒక్కొక్క రోజుమాత్రం ఇద్దరు తోడికోడండ్రూ తీవ్రంగా కీచులాడుకుంటూవుండేవారు. ఈ విధంగా బాధపడడంకంటే, కొన్నాళ్ళు విడిపోవడం మంచిదనే నిశ్చయానికి వచ్చారు.

ఆరోజు రాత్రి ఇద్దరూ తండ్రికి చెప్పి ఆయన చెప్పినట్లు విడిపోయారు.

ఆ మరునాడు కామాక్షమ్మ అన్నం వండలేదు. కూరలు మాత్రం చేసింది. అనసూయమ్మ కూరలు చేయలేదు గానీ అన్నం వండింది. మధ్యాహ్నం పొలానికి అన్నం తీసుకుపోవాలి గనుక కామాక్షమ్మ ఒక గంపను బోర్లించి దాని సాయంతో గాదెమీద కెక్కింది. పాదాలు శుభ్రంగా తుడుచుకొని గాదెలోనికి దిగింది. చాలా రోజులనుండి వేసిన అన్నం, సంకటి ముద్దలు కలసి

బాగా మురిగిపోయింది గనుక మెడలుదాకా దిగబడిపోయి అలాగే నిల్చున్నది. కేకవేస్తే అసలుగుట్టు బయట పడుతుందనీ, తన తెలివి లేమిని చూచి అందరూ నవ్వుకుంటారనే ఆలోచనతో ఊపిరాడ కుండాకొట్టుకొంటున్నది.

అనసూయా దేవిగారు కూడా తాను మిగలబెట్టిన కూర తీసుకోడానికి కాగులోకి వంగింది. అది అందకుంటే మరీ వంగడంచేత తలకిందులుగా కాగులో పడి విలవిల తన్నుకొంటుంటే కాగు క్రిందకి వాలిపోయింది. ఆమె ముఖమంతా పాచిపట్టిన కూరతో నిండుకుపోయి కళ్ళు కన్పించక చేతులు కాగులో చిక్కుకున్నవి. తలమాత్రం బైటకు వచ్చి కొద్దిగా ఊపిరాడుతున్నది.

మధ్యాహ్నం రెండుగంటలు దాటినా అన్నాలు రాలేదని యిద్దరన్న దమ్ములూ యిళ్ళకువచ్చారు. భార్యలున్న తీరుచూచి లోలోపల నవ్వుకొని తగినశాస్తి జరిగిందనుకొని బైటకు తీశారు. కామాక్షమ్మ వండిన కూరలను, అనసూయ వండిన అన్నాన్ని యిద్దరూ తిని పొలాలకు వెళ్ళిపోయారు.

ఇద్దరక్క చెల్లెళ్ళూ స్నానాలుచేసి మళ్ళీ ఒక్కటిగా ఎసరుపెట్టడం ప్రారంభించారు. రాత్రి యింటికి వచ్చిన మామగారు కోడళ్ళలోని మార్పునుచూచి ఆశ్చర్యపడ్డాడు.



# రూకలసంచి

ఈ కథ రసాతలంలో జరిగింది. మనకుపైన ఏడులోకాలున్నట్టుగానే కింద ఏడు లోకాలున్నాయి. వాటిలో రసాతలం ఒకటి. అందులో ఒక భాగాన్ని వినాయకుడనే ఎలుకలరాజు పాలిస్తూ ఉండేవాడు. ఆ పట్టణంలో చిన్నారి అనే ఒక చిట్టెలుక కాపురం చేస్తుండేది. ఆ ఎలుక్కి జిమ్మీ అనే ఒక పాప.

పాపం! జిమ్మీ పుట్టిందే వాళ్ళనాన్న చనిపోయాడు. అమ్మ చిన్నారి చాలా శ్రమపడి బిడ్డను పోషిస్తుండేది. జిమ్మీ రోజూ బడికి వెళ్ళేది. శుక్రవారాల్లో గుడికి గూడా వెడుతుండేది. వాళ్ళ కులదేవుడు విఘ్నేశ్వరుడు. ఏ ఆపదలూ రాకుండా కాపాడమని మొక్కుకొనేది.



ఒకనాడు జిమ్మీ పలకా పుస్తకాలు పట్టుకొని బడి నుండి పాడుకుంటూ యింటికి వచ్చింది. ఇంట్లో అలికిడిలేదు. మెల్లగా లోపలికి వెళ్ళింది. తన పుస్తకాలన్నీ చిందరవందరగా పడవేసి వున్నాయి. ఒక మూలనుండి సన్నని స్వరం వినిపించింది. దగ్గఱకు వెళ్ళి చూస్తే జిమ్మీ కడుపు తరుక్కుపోయింది. చిన్నారి ఓ స్తంభానికి విరిచి కట్టేసివుంది. వెంటనే కట్లన్నీ కొరికి పారేసింది. చిన్నారి ఏడుస్తూ, ఎన్నోనాళ్ళుగా కష్టపడి సంపాదించి పెట్టిన రూకలసంచిని దొంగ తీసుకెళ్ళాడని చెప్పింది. జిమ్మీ వెంటనే వెళ్లి రాజుగారికి ఫిర్యాదు చేసింది. వినాయక మహారాజు పట్టణమంతా చాటించాడు. పత్రికల నిండుకూ ప్రకటనలు గుప్పించాడు. చిన్నారి యింటిలో దొంగిలించినవాణ్ణి పట్టి యిచ్చిన వారికి ఒక నాగమణిని బహుమానంగా యిస్తామని గూడా ప్రకటించాడు.

గజదొంగ యీవార్త విని జాగర్తపడ్డాడు. దొంగను పట్టడం ఎవరికీ వీలుగాక పోయింది. సొమ్ము పోయింది గదా అనే చింతతో దిగాలుపడి కూచున్న జిమ్మీని బడికి పిలవడానికి వచ్చిన పిల్లలందరూ వెళ్ళిపోయారు. ఈలోగా జిమ్మీ ముందు ఒక గండు చీమ కనిపించింది. అక్కడ జిమ్మీని చూచి 'ఎందుకమ్మా ఏడుస్తున్నావ్' అని అడిగింది. జిమ్మీ జరిగిన విషయాన్నంతా చెప్పింది.

గండు చీమ మెల్లగా పెట్టె దగ్గరికి వెళ్ళి దొంగ అడుగుల్ని పసిగట్టింది. వెంటనే 'నావెంటరా. నేను దొంగని పట్టిస్తా' నంటూ బయలుదేరింది.

జిమ్మి అత్యుత్సాహంతో అడుగులు వేసుకుంటూ గండు చీమను వెంబడించింది. గండుచీమ రాళ్ళూరప్పలు దాటుకొని ఒక పుట్ట దగ్గఱకు వచ్చింది. 'నువ్వు బయటనేవుండు. నేను లోపలికి వెళ్ళి దొంగ ఉన్నాడో లేడో కనుక్కొని వస్తా' నని వెళ్ళింది. సమయానికి దొంగ బాగా తిని గాఢంగా నిద్రపోతున్నాడు. గండుచీమ రూకల సంచి నోటితో కరచుకొని పైకి వస్తుంటే గలగలమనే శబ్దం వినిపించింది. దొంగ ఉలిక్కిపడి లేచాడు. రూకలసంచి పైకి పోతుంటే గట్టిగా వెనక్కి లాగాడు. చీమ కిందికి జారింది. దీనికింత పొగరా అనుకొని దొంగ యింటి నిండుకూ పొగ పెట్టేశాడు. ఈ పొగకు గండుచీమసొమ్మసిల్లి పడిపోయింది. లోపలనుండి బ్రహ్మాండమైన పొగ రావడంతో జిమ్మీ భయపడి పరుగెత్తికెళ్ళి రాజుగారితో చెప్పింది. రాజు సైనికుల్ని పంపించి పుట్టను తవ్వించాడు. లోపల రూకల సంచితో దొంగ దొరికాడు. గండు చీమను పైకి తెచ్చి వైద్యుల చేత ఉపచారాలు చేయించాడు. బహుమానం గండుచీమకు లభించింది. దొంగను చెఱసాలలో పెట్టారు. జిమ్మి, చిన్నారి, రూకల సంచితో హాయిగా యిల్లు చేరుకున్నది.

# గుఱ్ఱపు లాడం

ఆ రోజు ఒక పీరియడు ముందుగా వదిలేశారు బడి. నందగోపాల్ తొందరగా వెడుతున్నాడు ఇంటికి. సగం దూరంలో ఉండగానే ఏదో కాలికి తగిలింది బలంగా వంగిచూశాడు. గుఱ్ఱపు లాడం భూమిలో పాతుకునిపోయి ఉంది. అది ఈ విధంగా ఎందరికి తగులుతుందో! మాస్టార్ ఉదయమే చెప్పాడు. దారిలో ముండ్లుగానీ రాళ్ళుగానీ, సీసాముక్కలుగానీ కన్పిస్తే ఏరి పారవేయడం మంచిదని.

నందగోపాల్ ఒక్కక్షణం ఆలోచించాడు. ఆ లాడం ముక్కను పైకితీసి దారి పక్కనున్న కంచెలో విసరివేసిగానీ వెళ్ళరాదనిపించింది. అక్కడే చెట్టుకింద పుస్తకాల సంచిని పెట్టాడు.



ఆ ప్రక్కనే ఉన్న పొడుగాటి రాతిచెక్కను తీసుకుని లాడం చుట్టూ తవ్వాడు. రెండు నిమిషాలశ్రమతో లాడం పైకివచ్చింది. తీసి చూచాడు. ఎంతబాగుందది. దాన్ని పారవేయడం తెలివి తక్కువనిపిచింది.

ఐతే ఏం చెయ్యాలి? ఆ వస్తువు ఎందుకుపయోగ పడుతుంది? క్షణం నిలబడి ఆలోచించాడు. లాడం చాలా బాగుంది. ఇది గుఱ్ఱానికి ఒక కాలికి సరిపోతుంది. ఈలాంటి మరోమూడు ఉంటే నాలుగు కాళ్ళకూ నాలుగు సరిపోతాయి.

నందగోపాల్ బిరబిరా చెట్టు కిందికి వెళ్ళాడు. పుస్తకాల సంచిలో లాడాన్ని పెట్టుకుని సంచిని భుజానికి తగిలించుకొని బయలుదేరాడు. ముందులాగా తొందరగా నడవడం లేదు. అతనిలో లాడాన్ని గురించిన ఆలోచనలు ఒక్కొక్కటే పైకి వస్తున్నాయి.

ముందు మూడు లాడాలు సంపాదించాలి. అప్పుడు నాలుగౌతాయి. గుఱ్ఱానికి నాలుగు కాళ్ళకూ నాలుగు - బాగుంది ఆలోచన.

'ఐతే గుఱ్ఱం కావద్దూ?'

'అవును కావాలి.'

'ఎలా సంపాదించాలి?'

'మళ్ళీ ఆలోచనలో పడ్డాడు నందగోపాల్.

గుఱ్ఱాన్ని కొంటేకూడా చాలామంచిదిగా ఉండాలి. వాయు వేగ మనోవేగాలతో పరుగుతియ్యాలి. గుఱ్ఱంమీద కూచుంటే నిమిషానికో మైలు కందిరీగలాగా దూసుకొని పోవాలి.

సెభాష్! స్వారీచేస్తుంటే అమోఘంగా ఉంటుంది. మరి అశ్వంమీద కూచోడానికి సీటు కావద్దూ? జీనుకూడా ఉండాలిగా? అప్పుడే తురంగం మీద స్వారి అద్భుతంగా ఉంటుంది.

వాటిని సులభంగా సంపాదించవచ్చు. గుఱ్ఱాన్నే సంపాదించినప్పు డదేపాటి?

ఇవన్నీ కుదిరినప్పుడు దానిమీద కూర్చోవటం ఈ దుస్తులతోనా? ఉహుఁ.... ఈ నిక్కరూ ఈ చొక్కా... దానికి పనికి రాదు. నెపోలియన్ వేసుకొన్నాడే అలాంటి దుస్తులైనా....లేక సంయుక్తను తీసుకుపోవడానికి వచ్చిన పృథ్వీరాజు వేసుకున్నాడే ఆ దుస్తులైనా సరిగా వుంటాయి.

బహుశా అవి చాలా ఖరీదవుతాయేమో! నందగోపాల్ నిమిషం కాలం ఆగిపోయాడు. అతనికి కొంచెం దిగులుపుట్టింది. అంతమంచి దుస్తులను ఏ విధంగా సంపాదించాలి?

ప్రయత్నిస్తే ఎందుకు కాదు? అతని కతడే సమాధానం చెప్పుకొని ముందుకు నడిచాడు. అప్పుడు నేనెలా ఉంటాను? ఒక్కసారి తలవంచుకొన్నాడు. శరీరం గగుర్పొడిచింది. ఒక పెద్ద రాజకుమారునిలాగా ఉంటాను. చేతిలో పట్టాకత్తి మెరిసి పోతుంటుంది. వేటుకు వెయ్యిమందినైనా తునకలు చేసి పాతేస్తాను.

ఛా,...ఛా.... ఇది పాడు ఆలోచన. మాష్టరుగారన్నారు కళింగ యుద్ధంలోఅశోకుడలాగే మనుష్యులను చంపి ఆ ఘోరాన్ని చూడలేకపోయాడు. బౌద్ధమతాన్ని పుచ్చుకున్నాడు. కనుక నేను యుద్ధం చేయను.

'యుద్ధంచేయను' అన్నాడు నందగోపాల్. గట్టిగా మాట అంటూండగానే వెనుకనే వస్తున్న కుర్రాడు ' ఏమిత్రా యుద్ధమా? ఎవరితో?' అని ప్రశ్నించాడు.

నందగోపాల్ తిరిగిచూచి సిగ్గుపడ్డాడు. ' ఏం లేదు ఏమీ లేదురా' అంటూ సంచి అడుగు భాగాన్ని తడిమి చూచాడు. లాడం చేతికి తగలేదు. సంచిని కిందపెట్టి పుస్తకాలనంతా పైకి తీశాడు. లాడంలేదు

' ఏమిత్రా వెదుకుతున్నావు?' మళ్ళీ ప్రశ్నించాడు కుర్రాడు.

ఈమారు నందగోపాల్ బదులు చెప్పకుండా వెనక్కు తిరుక్కున్నాడు. పొద్దుపోయేవరకూ వెదికాడు. లాడం కన్పించలేదు. మరునాడు, ఆ మరునాడుకూడా వెదికాడు కన్పిస్తేగా? రోజూ బడికి వెళ్ళుతున్నప్పుడల్లా చూశాడుగానీ అది కన్పించనేలేదు. ఇంతకూ ఆ లాడం ఎలా పడిపోయింది? యెక్కడ పడిపోయింది. నందగోపాలు కిప్పటికీ అంతు చిక్కలేదు.



# చిలకమ్మ

కొత్త పెళ్ళికొడుకు ఖండేరావు. పెళ్ళయి ఒక నెలేఐంది. ఉగాది పండుగకు రమ్మని అత్తగారింటి దగ్గర నుండి పిలుపు వచ్చింది. అంటుపోగులకు మెరుగు వేయించుకొని వేలి కో ఉంగరం తగిలించుకొని పెళ్ళికొడుకులా తయారయ్యాడు.

కొత్తగా పట్టుకొని వచ్చిన మైలవన్నె గిత్తలు బండికికట్టి ఇంట్లో చేసిపెట్టిన ఫలహారం మూట కట్టుకొని బయలుదేరాడు.

బండి చప్పుడు వినిందే మరదలు చిలకమ్మకు బావను అల్లరిచేయాలని ఆలోచన. అందుకోసం, కావలసిన సరంజామానంతా సమకూర్చి పెట్టుకొన్నది.



ఖండేరావు స్నానం చేసివచ్చాడు. చిలకమ్మ తిరుచూర్ణం పెట్టెను తెచ్చిపెట్టి బొట్టు పెట్టుకోమన్నది. అబ్బే నాకు నామాలు పెట్టుకునే అలవాటు లేదన్నాడు ఖండేరావు. నామాలు పెట్టుకుంటే పాతఫేషన్ అని అత్తగారింటిలో అనుకుంటారేమోనని ఖండేరావు అనుమాన పడ్డాడు. 'బావా నీకు నూటపదకొండు యిస్తాలే' అన్నది చిలకమ్మ. ఖండేరావు కామాటలేమీ అర్థంగాలేదు.

'భోజనం వేళైంది రమ్మనవే' అంటూ కోకిల పిలిచింది లోపలనుండి. 'బావా! అక్క రమ్మంటుందే' అంటూ చేయిపట్టి తీసుకెళ్ళింది చిలకమ్మ ఖండేరావును.

ఖండేరావు చక్కా వెళ్ళి ఎత్తయిన పీటమీద కూచున్నాడు. కింద పటపటమంటూ ధ్వని వస్తుంటే వెనక్కిపడ్డాడు. 'తుంటరిపిల్ల ఎంతపని చేసి'ందంటూ కోకిల పీటకింద పెంకులనంతా ఎత్తి పారవేసింది ఖండేరావు కూచున్నాడు.

కోకిల కూనిరాగాలు తీస్తూ వడ్డించింది. నేనూ వడ్డిస్తానంటూ చిలకమ్మ వేంపుడు తెచ్చిపెట్టింది. ఖండేరావు అనుమానంతోనే నోట్లో వేసుకున్నాడు. కొండ మిరపకాయల కారం... కళ్ళు గండిపడినట్లు నీళ్ళు కారుతుంటే నాలుక చొంగలు కార్చింది. కోకిల చెల్లెను గట్టిగా మందలిస్తూ నెయ్యి కొంచెం ఎక్కువగా వేసింది. ఖండేరావు బతుకు జీవుడా అని భోజనం ముగించి వసారాలో కూచున్నాడు.

'బావకు వక్కాకు యివ్వవే' అంటూ కేకవేసింది కోకిల. చిలకమ్మ పరుగునా వక్కాకుతట్ట తెచ్చి పెట్టింది. ఖండేరావు రెండు పోకలు తీసి నోట్లో వేసుకున్నాడు... ఎంత సేపయినా అవి నలిగే సూచన కనిపించలేదు. -సరే ఆకులతో నమలితే సరిపోతుందేమోనని ఆకు తీసుకుని సున్నంరాచి నమిలి చూచాడు. ముక్కుల్లోకి గప్పుమని పసరువాసన కొట్టింది. నోరంతా బంక కట్టుకుపోయింది. వెళ్ళిందే ఉమ్మివేస్తుంటే చిలకమ్మ వక్కాకు నములుతూ నా నాలుక చూడు బావా అంటూ ఎర్రని నాలుక చాచింది. ఖండేరావు వసారాలో కూచొని వక్కాకు తట్టని నిదానించి చూచాడు. అక్కడున్నవి వక్కలైతేగా...అవి లక్కతో చేసిన పోకలు. తమలపాకులు బదులు కావిలి ఆకులుంచింది. సున్నంగాదు వెన్నపూస. కోకిల నవ్వుతూ తాంబూలం తెచ్చి పెట్టింది. ఖండేరావు తాంబూలం నములుతుంటే 'బావా సిగరెట్లు' అంటూ ముందుకు వచ్చింది. ఖండేరావు తీసుకుని యిది సిగరెట్టవునో కాదో అంటూ నిదానించి చూచాడు. అవును సిగరెట్టే సందేహం లేదు. కత్తెరమార్కు బాగా తెలుస్తోంది.

ఖండేరావు ఠీవిగా సిగరెట్టు నోట్లో పెట్టుకొని అగ్గిపుల్ల వెలిగించి ఒక్క దమ్ము ఈడ్చి చిన్న చిన్న మేఘాల్లాగా పొగను వూదాడు. 'బావుందే చిలకా' అంటూ మళ్ళీ రెండోదమ్ము పీల్చాడు. 'ఢమీ' అంటూ సిగరెట్టు పేలిపోయింది. ఖండేరావు కుర్చీమీదనుండి వెనక్కి దొర్లుకున్నాడు. చిలకమ్మ పకపకా నవ్వుతూ పరుగెత్తింది.

ఖండేరావు పైకి లేస్తూ ఆ సిగరెట్టు ముక్కను చూచాడు. ఎలాగ పెట్టిందో తెలియదుగానీ లోపల టపాకాయ వుంది.

ఖండేరావు మరదలు తెలివికి అబ్బురపడుతూ ఇంట్లోకి వెళ్ళి మంచంమీద పడుకున్నాడు. ప్రయాణపు బడలికతో హాయిగా నిద్రపట్టింది.

బాగా నిద్ర పోయాడా లేదా తెలుసుకొని నామకొమ్ము తెచ్చి బావకు పంగనామాలు తీసింది. బావ నిద్రలేచిందే షికారు బయలుదేరాడు. వీధిలో వెడుతుంటే 'ఓహో! కొత్త పెండ్లికొడుకా' అంటూ అందరూ వింతగా చూస్తున్నారు. చిలక వెనకాలే వెడుతున్నది. కొంతదూరం వెళ్ళిందే భజన గుడిదగ్గర ఆగిపోయాడు ఖండేరావు. అక్కడున్న వారిలో ఒకాయన ' అల్లుడుగారికి నూటపందకొండు ఎంతలావు ఎంత పొడుగు తీశారోయ్' అన్నాడు. ఖండేరావు నొసటని తాకి చూస్తే పట్టెనామాలు చెక్కులు చెక్కులుగా వూడిపడ్డాయి. వెనక్కి తిరిగిచూస్తే చిలకమ్మ పరుగెత్తుతోంది. ఖండేరావు వచ్చి అద్దంలో చూచాడు. సాక్షాత్తు ఆంజనేయులు ముఖంలా చేసిపెట్టింది.

ఆ ఉదయం పండుగ బాగా జరిగింది. మరునాడు ఖండేరావు కోకిలమ్మతో పాటు అత్తగారిచ్చిన బహుమానాలు పుచ్చుకొని బండికట్టాడు. 'బావా బండి నేనే తోలుతా'నంటూ చిలకమ్మ ముందు కూర్చున్నది. బావ బండి దిగమన్నాడు. దింపితే నూటపదకొండు వేస్తానన్నది. ఖండేరావు నవ్వుతూ బండిని కదిలించాడు.

# బాలవీరులు

సుమారు ఒక వంద సంవత్సరాలకు ముందు జరిగిందీ కథ. అప్పుడు మన దేశంలో ప్రతి గ్రామానికీ ఒక మాంత్రికుడుండేవాడు. అతడంటే గ్రామమంతటికీ సింహస్వప్నమే. అతని కేది కావలసినా రైతులు మారు మాట్లాడకుండా యిస్తూ వుండవలసిందే. అలా యివ్వకుంటే ఫలితంగా ఏదో ఒక ప్రమాదం జరుగుతుండేది.

కొండవీటి ప్రాంతంలో ఒక పల్లెసీమ. ఆ ఊళ్ళో రామదాసనే మాంత్రికుడు. అతని జడలు మట్టి ఊడల్లాగా పాదాల వరకూ వేలాడుతుండేవి. గడ్డం సింహం జూలు లాగా భయంకరంగా ఉండేది. అతడు పసిపిల్లలకు స్వప్నంలోగూడా వచ్చేవాడు.

ఒకనాడొక రైతును బొప్పాయి పండ్లడిగాడు. అతడివ్వననగానే 'సరే చూచుకో' అన్నాడు.



ఆ సాయంకాలానికల్లా అతని పిల్లాడు గోవిందు కనిపించలేదు. ఎద్దొకటి అగుపడలేదు. ఆ రాత్రి ఊళ్ళోని మరి నలుగురు పిల్లలు పత్తాలేరు. ఇదంతా స్వాములవారి మహత్యమేనని తెలిసిపోయింది. రైతులంతా వచ్చి రామదాసువద్ద మొర పెట్టుకొన్నారు. అతడు నిర్దాక్షిణ్యంగా కసరికొట్టి నాకు తెలియదు పొమ్మన్నాడు. నిందిస్తే ఇంకేం ముప్పులొస్తాయోనని కిక్కురుమనకుండా ఎవరిళ్ళకు వారు వెళ్ళి తలుపులు వేసుకున్నారు.

శీను, వాసు, కేశవుడు ఈ ముగ్గురూ గోవిందుని స్నేహితులు. వెన్నెల్లో నలుగురూ కోలాటాలేసేవారు. ఆ రాత్రి గోవిందుడు లేకపోడానికి రామదాసే కారణమని తెలిసింది. ఈ మాంత్రికుణ్ణి ఊళ్ళోనుండి వెళ్ళగొట్టకుంటే లాభం లేదనుకున్నారు.

ముగ్గురూ మరో కుర్రాణ్ణి పిలుచుకొని మాంత్రికుని గుడిసెవద్దకు వెళ్ళారు. లోపలికి తొంగిచూచారు. రామదాసు 'ఓం...హ్రీం... ....పాతాళభైరవా' అంటున్నాడు. 'నీ మంత్రాలు చాలించి గోవిందుణ్ణెక్కడ దాచావో చెప్పవయ్యా' అన్నారు. అతడు పలకలేదు. ఊళ్ళోకివచ్చి చూస్తే అందరూ తలుపులు బిడాయించుకొన్నారు. ఒకరు గూడా బైటికి రారు. రామదాసుకు భయపడి ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్నారు.

ఈ నలుగురులోనూ శీనుకు ధైర్యం ఎక్కువ. అతడు యింటికివెళ్ళి ఒక మోకును తెచ్చాడు. కేశవుణ్ణి పంపి ఒక జత ఎద్దులను పట్టుకురమ్మన్నాడు. ఎద్దులు వచ్చాక అందరూ రామదాసు గుడిసెవద్దకు చేరుకున్నారు. రామదాసు తలుపు బిడాయించుకొని లోపల మంత్రాలు చదువుతున్నాడు.

గుడిసె చుట్టూ మోకును రానిచ్చి ఆ మోకును ఎద్దులకాడికి తగిలించి ముందుకు తోలారు. ఒక్క ఊపులో గుడిసె పెకలించుకొని వచ్చింది. రామదాసు గాభరాతో బయటికి వచ్చాడు. శీను, కేశవుడు రామదాసును పట్టుకొన్నారు. మిగిలిన యిద్దరూ పెడతెక్కలు విరిచికట్టారు.

'గోవిందుణ్ణి చూపుతావా కొరడాదెబ్బలు తింటావా?' అంటూ భయపెట్టారు. ఈలోగా ఊళ్ళో వాళ్ళంతా పోగయ్యారు.

'ఈ కుర్రకారుకు పోగాలం వచ్చింది. స్వాములవారికి కోపంవచ్చి శాపంపెడ్తే... పల్లె పల్లె భస్మమై పోతుం'దన్నారు. శీను ఎవరి మాటనూ లెక్కచేయకుండా రామదాసును జాటీతో రెండంటుకున్నాడు. రామదాసు పిల్లల్ని చూపుతానన్నాడు. ముందు రామదాసు నడుస్తుంటే అతణ్ణి కట్టివేసిన మోకుని పట్టుకుని వెనక శీను నడిచాడు. గ్రామంలో ధైర్యం గలవారు పదిమందికి పైగా వారిని వెంబడించారు.

రెండు మైళ్ళలో పెద్ద అడవివుంది. ఆ అడవిలో ఒక పాడుపడిన నృసింహస్వామి దేవాలయం. రామదాసు ఆ దేవాలయం దగ్గర ఆగాడు. లోపలికి వెళ్ళమన్నాడు కుర్రాళ్ళను. ఇతడేదో మోసంచేస్తున్నాడని శీను తెలుసుకున్నాడు.'నీవే ముందు వెళ్ళాలి' అంటూ రామదాసును ముందుకు నెట్టాడు. రామదాసు గర్భ గుడిదాకా వెళ్ళి మళ్ళీ ముందుకు అడుగుపెట్టక

నిలిచిపోయాడు. 'మంచి మాటల్తో మావిడికాయలు రాలవుగా' అంటూ శీను పళ్ళు కొరికాడు. రామదాసు విగ్రహం ముందు నిలబడి విగ్రహం నెత్తిమీదనున్న మరను కిందికి నొక్కాడు. వెంటనే విగ్రహం పక్కకు ఒరిగింది. మనిషి వెళ్ళడానికి చాలినంత సందు కన్పించింది. రామదాసు దిగుతుంటే ఒక్కొక్కరే కిందికి దిగారు. లోపల ఒక చిన్నగది. అందులో గోవిందు స్పృహతప్పి పడివున్నాడు. నలుగురు పిల్లలూ బిక్కుబిక్కుమంటూ చూస్తున్నారు. శీను వారందరినీ పిల్చుకొని బయటికి వచ్చాడు. రామదాసుకు పంగనామాలు తీసి ఊరేగించాలన్నాడు. స్వాములవారికి చెమట పట్టింది. అక్కడున్న రైతుల పాదాలమీద పడి 'మీ కెప్పుడూ ఎక్కడా కనిపించను. నన్ను విడిచిపెట్టండి' అన్నాడు. కనిరించమని రైతులు శీనుచెప్పారు. శీను దయతలచి విడిచి పెట్టాడు. రామదాసు కాలికి బుద్ధి చెప్పాడు. గ్రామస్థులంతా ఏకమై బాల వీరులను ఊరేగించి ఘనంగా సన్మానం చేశారు. అప్పటి నుండి ఆ ప్రాంతాలకు ఏ మాంత్రికులూ రావడం లేదు.

# సజ్జరొట్టెలు

ఈ కథ చాలా కమ్మగా వుంటుంది. ఎందుకంటే, మీరు చదువుతూ చదువుతూ వెళ్ళి తియ్యని సజ్జరొట్టెలు తినబోతున్నారు.

అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళలోకములు. ఈ పేర్లు మీరు వినలేదా ఇవన్నీ మన భూలోకానికి అడుగున వున్నాయని మాతాత చెబితే తెలిసింది గానీ నేను చూడలేదు. అక్కడికి వెళ్ళడానికి మానవులకు సాధ్యం కాదనేశాడు తాతయ్య.



ఈ లోకాలకంతా దిగువ ఒక లోకం వుంది. దాని పేరు సుందరలోకం. ఆ లోకంలో మనది కృష్ణాపురమనే పెద్ద గ్రామం. ఆ గ్రామంలో సదానందమనే రైతు.

రైతంటే రేయీ పగలనక పొలంలో కష్టపడేవాడు గదా! చెరువు కింద రెండెరకాలు పొలం వుంది. ఆ చెరువుకు కట్టవుందిగానీ బ్రహ్మాండమంత గండి పడింది. తూములు మూడున్నాయిగానీ ఒకదానికి రంధ్రంలేదు. రెండోదానికి తలుపులేదు. మూడోది మూయబడింది. లేక లేక వర్షం వచ్చి కళ్ళాపునీళ్ళు చల్లితే చెరువునిండి మొరవసాగింది. ఇకనేం, చెరువుకింద మడి దున్నడం ప్రారంభించాడు, సదానందం.

సదానందానికి రెండు నాగళ్ళున్నాయి. ఒకదానికి కర్రులేదు; రెండోదానికి మేడిలేదు. రెండెద్దులున్నాయి. చాలా పుష్టిగా వున్నాయి. ఒక ఎద్దుకు ముందరికాళ్ళు, రెండో ఎద్దుకు వెనుక కాళ్ళూ లేవు.

ఐనా మడక కట్టించాడు దున్నడానికి. ఒక కయ్య చాలు కలువలేదు. రెండో కయ్య మూల కలవలేదు. ఎండిన ఎరువు పండిన ఆకు తెచ్చివేశాడు.

ఈ లోగా నాలుగు తూములు విత్తులు చల్లాడు. వాటిలో రెండు తూములు పుచ్చిపోయాయి. రెండు తూములు మొలకవచ్చి చచ్చిపోయాయి. పుచ్చిన విత్తులు చచ్చిన మొలకలతో కయ్యను నాటివేశాడు.

మరో కయ్యలో చెఱకు పండించాలని విత్తనం తెచ్చాడు. సగంపాది మొలవకనే చచ్చిపోతే మొలచిన సగం చెద పట్టింది.

సదానందం నీళ్ళు కడుతున్నాడు గానీ బీటలు విడిన చేలలో తడి కనబడదు.

ఏదో సేద్యం సాగాలి గదా! పండినా ఎండినా పన్ను కట్టాలి గదా?

సజ్జపైరు పెరుగుతూ వుంది. చెఱకుపైరు ఎదుగుతూ వుంది. సజ్జకంకులు చుక్కలను చూస్తుంటే చెఱకు పైరు మేఘాలను రాచుకుంటూ వుంది. ఇలాగా ఎదిగిన పైరును కోయాలనుకుంటే వచ్చిపడింది మిడతల దండు.

ఈ మిడతలదండు తోలుకుంటుంటే చెఱకుదోటలో ప్రవేశించినవి నక్కల సైన్యం.

సదానందం తూటాలులేని తుపాకి తీసుకొని నక్కలవైపు గురిపెట్టి టపాకాయలు పేల్చేశాడు. పెనిమల్లో నీళ్ళుపోసి దివిటీలు పట్టి మిడతలకు స్వర్గం చూపించాడు.

ఇక తొందరగా కోయాలనుకొని కూలీలను రమ్మన్నాడు. ఎనిమిదిమంది వచ్చారు. అందులో నలుగురికి చేతుల్లేవు. నలుగురికి కొడవళ్ళు లేవు, పైగా గుడ్డివారు.

పంట కోస్తూ కూలీలు పాట ప్రారంభించారు. సదానందం మీసాలను మెలివేస్తూ గొడుగు పట్టుకొని చుట్ట పీలుస్తూ గనిమెమీద నిల్చున్నాడు. పాట అతల వితల సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకాలను దాటుకొని భూలోకానికి వినబడుతోంది.

చిటపట చిటపట
పటపటమంటూ
టపటప కురిసెను
వర్షంబు....
బొట్టురాలాలేదు
నేలతడవాలేదు.

జలజల జలజల
గలగల మంటూ
ప్రవహించింది
సెల ఏరు

మూర సాగాలేదు
ఇసుక తడవాలేదు
పొంగే వాగుల
పొంగే ఏరుల
నిండి పోయినది
మా చెరువు

తూము మూయాలేదు
గండి కట్టాలేదు.
తడిసీ తడవని
పొలము దున్నగా
వచ్చెను రెండు
నాగళ్ళు
ఒకటి కర్రేలేదు
రెండు మేడీ లేదు.

గబ గబ దున్నే
నాగలి నీడ్వను
వచ్చేను రెండు
బసవళ్ళు
ముందు కాళ్ళూ లేవు
వెనుక కాళ్ళూ లేవు.
పుచ్చిన విత్తులు
చచ్చిన మొలకలు
వచ్చెను ఎదిగీ

సజ్జల్లు
ఒకటి జానెత్తూ
ఒకటి మూరెత్తూ

పండీపండని
సజ్జలకోయను
వచ్చితిమండీ
మేమంతా
నలుగురు కుంటోళ్ళు
నలుగురు గుడ్డోళ్ళు!

ఈ పాట వినగానే సదానందానికి కోపం వచ్చింది. వెంటనే వారినంతా పిలిచి బళ్ళను తిప్పించి తిప్పించి తిరగేసి ధాన్యం కొలిచాడు. పాపం వారు ఆ ధాన్యంతో వెళ్ళిపోయారు. సదానందం పంటను రాల్చి పెద్ద కుప్పబోసి ఇంటికి తోలించాడు, బస్తాలకు మూతులు

బిగించకుండా. ఇంటావిడ పేరు అన్నపూర్ణమ్మ. వెంటనే సమారాధన ప్రారంభించింది. భోజనాలు జరుగుతుండగా వచ్చిన అతిథులు సంతోషంతో భజన ప్రారంభించారు.

సమారాధన సమారాధన
సదానందము సమారాధన
సజ్జరొట్టెల సమారాధన
భజగోవిందం
భజగోవిందం
భజగోవిందం
సదానందం!

ఉడికీ ఉడకని సజ్జరొట్టెలు
వడిగా వచ్చిరి ప్రజలంతా
పడిపడి వచ్చిరి జనమంతా
కడుపులు లేని
ప్రజలు కొందరు
నోళ్ళేలేని
జనులు కొందరూ!

సదానందం ధర్మగుణాన్ని పొగిడి పొగిడీ అలసిపోయారు వచ్చినవారంతా. ఈ విషయం ఆ సుందరలోకాన్ని పరిపాలించే నందన మహారాజుకు తెలిసింది.

ఇంకేముంది! సదానందం సరదాగా బయలుదేరినాడు. కిరీటాలులేని సామంతులు, పోర్టుఫోలియోలు లేని మంత్రులు, ఆయుధాలులేని సేనానులు పైకి లేవలేని అంగరక్షకులు వారివారి స్థానములలంకరించి యున్నారు. నందనభూపతి సదానందమును కౌగలించుకొని.... పెద్ద బిరుదులు యిచ్చాడు.

సదానందుడు ఆ బిరుదులను మోసుకొని వచ్చి అన్నపూర్ణమ్మ కిచ్చాడు.

ఈలోగా సదానందుడు పండించిన సజ్జలు ఎంత రుచియో అనుకొని దేశంలో వారంతా యింటిమీదికి ఎగబడ్డారు. ఇక వచ్చేవారికి అమ్మే తీరికలేకుంటే అతని అవస్థను చూచిన అవ్వ చంద్రమండలం నుండి దిగి వచ్చింది.

ఉన్న సజ్జలను, బెల్లాన్ని బేరంచేసి అన్నింటినీ తీసుకొని వెళ్ళిపోయింది.

ఆ రోజునుండి చందమామలో కనిపించే మర్రిచెట్టు కింద అవ్వ కూచొని రొట్టెలు కాలుస్తూనే వుంది.

ఆకాశంలో మేఘుడు, అశ్వని, రోహిణి, ఇత్యాది ఇరవై యేడు మంది తారకలు, ఇంకావుండే రాహువు, కేతువు, అంగారకుడు, శనిలాంటివాళ్ళు, యింకా ఎందరో రోజూ ఆ యవ్వదగ్గర రొట్టెలు తీసుకొని తింటూంటారట.

నిజంగా అవి బలే కమ్మగా వుంటాయని చాలామంది అంటుంటారు.

ఆకాశవీధిలో
వెలుగు చుక్కల్లారా!
చుక్కల్ల మధ్యలో

చక్కన్ని చంద్రా!
చందమామా లోని
నీడలో అవ్వా
చుంయ్యి చుంయ్యి రొట్టె
ఒక్కటిస్తావా?
రంయ్యి రంయ్యి మంటూ
పరుగెత్తి వస్తే
పైపైన నీవున్ను
పరుగిడుదువేలా?
కమ్మన్ని రొట్టె
కిమ్మత్తు ఎంత?

అని మనం అడిగితే అవ్వ ఏమంటుందో తెలుసా

ధ్రువుడు నా బంగారు
దొరబిడ్డకిత్తు
బాలచంద్రునికిత్తు
పసిడి కంచమున
వీరశివాజీకి
వేవేగ నిత్తు
పేరు దెచ్చితిరంటె
పిలిచి నేనిత్తు

అంటుందట.



# వనపాలకులు!

ఎన్నికల రోజులు దగ్గరపడుతున్న కొలదీ జంతులోకంలో సంచలనం ఎక్కువైంది. ఈమారు ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకొని తీరుతామని గుంతనక్క ప్రతిజ్ఞ చేసింది. దానికి తెలుసు - ఈ జంతువులన్నీ తాత్కాలికంగా ఏ కొద్ది లాభం వచ్చినా లొంగిపోయి ఓట్లు వేసేస్తాయని.

పోటీకి నిలిచినవి ప్రధానంగా మూడు పార్టీలు. ఒకటి ఏనుగుల పార్టీ, రెండవది సింహాల పార్టీ, మూడవది జింకల పార్టీ. ఒక్కొక్కదానికి ఒక్కొక్క గుర్తున్నది. ఏనుగుల పార్టీ పెట్టెకు మహావిష్ణువు స్వయంగా వచ్చి గజరాజును రక్షిస్తున్నట్లున్న బొమ్మ. సింహాల పార్టీకి ఆదిశక్తి శూలాన్ని ధరించినట్టున్న బొమ్మ. జింకల పార్టీకి మాత్రం రెండాకులూ ఒక పువ్వు.



ఎన్నికల ప్రచారంలో అరణ్యమంతా మారుమోగిపోతున్నది. శాకాహారులన్నీ మాకే ఓటు వేయాలని జింకల పార్టీ ఎలుగెత్తి చెప్పింది. మా పార్టీ ప్రభుత్వానికివస్తే ముందుగా సింహాలను బంధిస్తామనీ, మాంసాహారుల ఆటలు సాగనివ్వమనీ - గ్రామీణ జంతువులైన పశువులు మేకలు గొఱ్ఱెలతో చెలిమి కుదుర్చుకొని, శాంతి భద్రతలతో పరిపాలన సాగిస్తామనీ జింకల పార్టీ కరపత్రాలను పంచిపెట్టింది.

సింహాల పార్టీ మాత్రం ఒక్కటే హెచ్చరిక చేసింది. 'ప్రాణాలు నిలుపుకోవాలంటే మాకే ఓటువేయాలి. ఏ పరిస్థితుల్లోనైనా సరే మాకు విజయం తప్పదు. అనాది నుండీ మా తరంవారే రాజ్యాలను పరిపాలిస్తున్నారు. అందుకే మాకు మృగరాజులని పేరు. దేవుడు మిమ్మల్ని పాలించడానికే మమ్మల్ని పుట్టించాడు. మాకు వ్యతిరేకులంతా దైవద్రోహులు. మేము ప్రభుత్వాన్ని నడపకుంటే దేశం అరాచక మౌతుంది. మానవులు మిమ్మల్ని యథేచ్ఛగా వేటాడుతారు. జంతులోకమంతా ధ్వంసమైపోతుంది' అంటూ బెదిరించటానికి ప్రారంభించినై.

ఏనుగుల పార్టీ మాత్రం 'తాము పవిత్రమైన జాతి, తమను లోకమంతా పూజిస్తుంది. రారాజులుగూడా మా మీద ఎక్కే ఊరేగుతారు గనుక ఓట్లు మాకే వేయాలని' నచ్చచెప్పడానికి ప్రయత్నించింది.

కుందేళ్ళు జింకల పక్షంలోనూ, గుంతనక్కలు సింహాల పక్షంలోనూ, ఏదుబందులు ఏనుగులపక్షంలోనూ, అహోరాత్రులు ఎడతెఱపి లేకుండా నినాదాలు రాసిన బోర్డులు పట్టుకొని ప్రచారాన్ని ప్రారంభించాయి. ఈ మూడు పార్టీలలోనూ ఏది గెలుస్తుందో యిదమిద్ధమని చెప్పడానికి వీలుగాని పరిస్థితి ఏర్పడిపోయింది.

ఇక ఎన్నిక మూడురోజు లుందనగా ఆల్ జంగిల్ రేడియోలో గుంతనక్క తన అనర్గళోపన్యాసాన్ని సాగిస్తూ ఎన్నికల ప్రణాళికను యీ కింది విధంగా వివరించింది:

'ఇది పరీక్షా సమయం. మానవజాతి వనసీమలనంతా పాడుచేసి మహా వృక్షాలను బొగ్గులు కాల్చి జంతువర్గాన్ని నశింపజేస్తున్నారు. ఈ మహా విపత్తునుండి జంతులోకాన్ని రక్షించగలిగింది మృగరాజు పార్టీ ఒక్కటే. అంతేగాదు. ఈ పార్టీ పెత్తనానికి వచ్చినపుడు ప్రపంచాన్నంతా అరణ్యమయంగా చేయడానికి సప్తవర్ష ప్రణాళికను సిద్ధం చేసింది. మన వంశాన్ని అగౌరవ పరచడానికి మనల్ని ఖైదుచేసి ప్రదర్శనశాలల్లో నుంచిన మానవజాతిపై కసిదీర్చుకోడం తొలిచర్య. ఇందుకోసం ప్రభుత్వ సైనిక సమీకరణ విస్తృతం చేయబడుతుంది. అవసరమైతే నిర్బంధ సైనిక సేకరణ గూడా జరుగుతుంది.

'నేడు మనం ఎదుర్కొంటున్న తీవ్రమైన సమస్య ఆహారంకొరత. రోజుకు పదిపౌనుల మాంసం చొప్పున మాంసాహారులకు. పండ్రెండు పౌనుల శాకాహారాన్ని శాకాహారులకు సరఫరా చేయబడుతుంది.'

'ఇంకొక్క ముఖ్యమైన విషయాన్ని గుర్తుపెట్టుకోండి. ప్రభుత్వాన్ని నడపడానికి శారీరక మానసిక బలాలు రెండూ వుండాలి. ఇది మృగరాజుపార్టీ ప్రతినిధుల కందరికీ వున్నది. గనుక మీ అమూల్యమైన ఓటును మృగరాజు పార్టీకే యిచ్చి గెలిపించండి.'

ఈ ఉపన్యాసాన్ని జంతువులన్నీ విన్నవి. రేపు ఎన్నికలు జరుగబోతాయనగా మృగరాజుపార్టీ డబ్బులిస్తామని ఆశ చూపెట్టింది. డబ్బులకోసం ఓట్లమ్ముకోవటం మనుష్యుల్లో ఉందిగానీ మృగాల్లో లేదని గుంటనక్క నిరోధించింది.

పోలింగునాడు జంతువులన్నీ కిటకిటలాడిపోయినై. ఏనుగులపార్టీ తరఫున ఒంటెలు - సింహాలపార్టీ తరఫున పులులు - జింకలపార్టీ తరఫున కుందేళ్ళు ఏజెంట్లుగా పని చేశాయి.

ఓట్ల లెక్కింపు పూర్తికాగానే పోలింగ్ ఆఫీసర్‌గా పనిచేసిన వానరుడు ఫలితాలు ప్రకటించాడు.

మృగరాజు పార్టీలో చాలామందికి డిపాజిట్లు పోయినవి. ముగ్గురుమాత్రం గెలిచారు. ఏనుగుల పార్టీలో ఇరవైమంది నెగ్గారు. జింకల పార్టీలో మాత్రం వందమంది గెలుపొందారు.

ప్రభుత్వాన్ని నిర్మించడానికి శాసనసభ సమావేశమైంది. వానరుణ్ణి తాత్కాలికంగా స్పీకరుగా ఎన్నుకొన్నారు. ఆయన కుర్చీమీద కూచోగానే గుంటనక్క కళ్ళజోడు సవరించుకొని పాయింట్ ఆఫ్ ఆర్డరు తెచ్చింది. 'రాజ్యాంగ చట్టంరీత్యా ఈ శాసనసభకు మంత్రుల్ని ఎన్నుకొనే హక్కులేదు. ఎందుకంటారా'? అని ప్రారంభించగానే కూచోకూచో అనే ధ్వనులు విపరీతమైనై. స్పీకర్ వానరోత్తముడు ఆర్డర్ ఆర్డర్ అని అరుస్తుంటే సింహాలు పులులు జింకల మీదికి దుమికాయి. ఏనుగులు ఎటూతోచక మధ్యలో ఆగిపోయినై. సింహాలు చంపిన జింకల శవాలను గుంటనక్కలు వారంరోజులపాటు తృప్తిగా తిన్నాయి. ఆ రోజు నుండి ఆ యరణ్యంలో మళ్ళీ ఎన్నికల ప్రస్తావనే రాలేదు. ఇప్పుడా యడవిలో శాకాహార మృగాలేవి జీవించడం లేదు. అవి మరో అరణ్యానికి వలస వెళ్ళిపోయినై. ఆ యడవి ఒక ఎడారిలాగా మారిపోయింది.





జననం : 1- 07-1923
మరణం : 4-11-1980

# రచయిత గురించి

కె. సభా చిత్తూరు జిల్లా కొట్రకోన గ్రామంలో పుట్టారు. ఉపాధ్యాయులుగా జీవితం ప్రారంభించి పత్రికా రచయితగా స్థిరపడ్డారు. శారదా పీఠాన్ని స్థాపించి, రచయితల సంఘాల ద్వారా తెలుగు సాంస్కృతిక, సాహిత్య వాతావరణంలో కొత్త చైతన్యాన్ని తీసుకువచ్చారు. రాయలసీమలో కథారచన అంటే తెలియని రోజుల్లో కలంపట్టిన సభా, సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ అలవోకగా రచనలు వెలువరించారు. నవలలు, కథలు, గల్పికలు, కావ్యాలు, బుర్రకథలు, గేయాలు, వ్యాసాలు, సంగీత రూపకాలు, నాటకాలు, జీవిత చరిత్రలు, లేఖలు, శతకాలు మొదలైన వాటిల్లో ఆయన చేసిన కృషి చాలా విస్తృతమైంది, వైవిధ్యభరితమైంది.

బాలసాహిత్యంలో వీరు చేసిన కృషి గణనీయమైంది. వీరి రచనల్లో ముఖ్యమైనవి కొన్ని : సూర్యం, చంద్రం, జిజ్జీబుజ్జీ వంటి నవలలు; వేణు విలాపం, గోమాత వంటి గేయ సంపుటాలు; చిలకమ్మ, బొంగరం, సీసాచరిత్ర, ప్రథమ భారత విప్లవ గాథలు, పావురాలు వంటి కథా సంపుటాలు; పరీక్షాఫలితాలు వంటి నాటికలు. ఆంధ్రప్రభలో 'బాలప్రభ' శీర్షికను అనేక సంవత్సరాలపాటు నిర్వహించి బాలల ప్రేమాభిమానాలను చూరగొన్న రచయిత - కె. సభా.

జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో కె. సభా అనేక సాహితీ సత్కారాలను అందుకున్నారు. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలో తన సాహిత్యకృషికి గుర్తింపునీ, పురస్కారాన్నీ పొందారు.